# రైతు చైతూ బండి సవారి

రచన, బొమ్మలు: విలియం స్టీగ్

అనువాదం: కె. సురేష్



# రైతు చైతూ బండి సవారి

రచన, బొమ్మలు: విలియం స్టీగ్

అనువాదం: కె. సురేష్





తెల్లవారటానికి ఒక గంట ముందే రైతు పైతూ లేచి, చప్పుడు చేయకుండా అడుగులో అడుగు వేసుకుంటూ బయటకు వచ్చాడు. పనివాడు యలమందని నిద్ర లేపాడు.



అతడు లాంతరు వెలిగించి కర్రకి తగిలించాడు. యలమంద ఎప్పటిలాగా గొణుగుతూ కాడి కిందకి చేరి, పగ్గాలు కట్టుకున్నాడు. పట్టణంలో కూరగాయలు అమ్మటానికి వాళ్లు బయలుదేరారు. రైతు చైతూ ఎగిరి బండిలో కూర్చున్నాడు.

ఎనిమిది గంటలకు వాళ్లు పట్నం చేరుకున్నారు. అలసిపోయిన యలమంద తన మందపాటి కళ్లద్దాల లోంచి నేలకేసి చూస్తూ ఉన్నాడు. పదిగంటలకల్లా కూరగాయలు అన్నీ అమ్మేశారు. రైతు చైతూ జేబులు డబ్బులతో నిండాయి. కొంత డబ్బుతో అతడు తనవాళ్లకు బహుమతులు కొన్నాడు. అందమైన తన భార్యకు కెమేరా కొన్నాడు. వస్తువులు తయారుచేయటం ఇష్టమైన పెద్ద కొడుకు కోసం కొన్ని పరికరాలు కొన్నాడు. కూతురు కోసం ఒక సైకిలు కొన్నాడు. ఆమె ఎన్నో రోజులుగా దానిని అడుగుతోంది. సంగీతం అంటే ఇష్టపడే చిన్న కొడుకు కోసం హార్మోనికా కొన్నాడు. తన కోసం గడియారం కొనుక్కున్నాడు. ఎండ అంటే ఇష్టం లేని యలమంద కోసం ఒక టోపీ కొన్నాడు.

బహుమతి ఆశించని యలమంద ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. సిగ్గుపడుతూ రైతు చైతూని కౌగిలించుకుని, “నా తోక తకధిమి!" అన్నాడు.



దాహం తీర్చుకోటానికి ఇద్దరూ చెరుకు రసం తాగి రెండు గంటలకు ఇంటికి బయలు దేరారు. అంతా బాగా జరిగితే, బాగా జరగపోటానికి కారణం ఏమీలేదు, రైతు చైతూ ప్రకారం మూడు గంటలకల్లా వాళ్లు తిరిగి ఇంటికి చేరుకుంటారు.



అది ఆగస్టు నెల. ఎండగా ఉండి ఉక్కబోతగా ఉంది. కబుర్లు చెప్పుకుంటూ వాళ్లు ముందుకు సాగుతున్నారు. వాన పడితే కాస్త హాయిగా ఉంటుంది అన్నాడు యలమంద. అవునన్నాడు రైతు చైతూ.



పురుగుల శబ్దాలు – జిజ్జింగ్-జెజ్జింగ్, చిర్రింగ్-విర్రింగ్ – వింటూ ఇద్దరూ మౌనంగా ముందుకు సాగుతున్నారు. రైతు చైతూ ఒక ఎర్రటి రుమాలుతో నుదుటికి పట్టిన చమట తుడుచుకున్నాడు. ఇంటి గురించి అతడు ఆలోచిస్తున్నాడు. బహుమతులు అందుకున్నప్పుడు తనవాళ్లల్లో కనిపించే ఆనందం చూడాలని అతడు తహతహలాడుతున్నాడు.





కొంచెం సేపటికి ఎగుడు దిగుడుగా ఉండే అడవి దారిలోకి బండి చేరుకుంది. కుదుపులతో బండి ముందుకు సాగుతుండగా నల్లటి మబ్బులు వాళ్లని కమ్మేశాయి. జోరు గాలికి చెట్ల కొమ్మలు అటూ, ఇటూ ఊగుతున్నాయి. ఏ వాననైతే వాళ్లు కోరుకున్నారో చివరికి ఆ వాన కూడా రానే వచ్చింది – ముందు సన్నటి చినుకులతో మొదలయ్యి చివరికి కుండపోతగా కురవసాగింది.



దారిలోని దుమ్ము మాయమయ్యింది, అదంతా నీళ్లతో నిండింది. ముందు దూరాన ఒక భయంకరమైన ఉరుము వినిపించింది.  తరవాత దగ్గరలోనే ఉరుములు వినపడసాగాయి. చెట్ల మధ్య ఒక మెరుపు కత్తిలాగా దూసుకుని పోయింది.



ఒక చెట్టు విరిగి తమ మీద పడబోవటం యలమంద, రైతు చైతూ చూశారు.
ఇద్దరూ ఎంతో భయపడిపోయారు, చనిపోవాలని వాళ్లకి ఏమాత్రం లేదు.



ఆ చెట్టు బండి వైపుకే పడుతోంది. మీదపడినప్పుడు బండి ఒక్కసారి ఊగిపోయింది. అయితే, అదృష్టం బాగుండి యలమందకీ, రైతు చైతూకీ ఎటువంటి దెబ్బలు తగలలేదు. ఇద్దరూ కొమ్మల మధ్య చిక్కుకుపోయారు.

యలమంద వైపు, పైన ఆకాశం వైపు రైతు చైతూ చూసి, “నా ముద్దుల భార్య, పిల్లల్ని చూడగలుగుతానా?" అంటూ ఏడ్చాడు. ఇటు యలమంద, అటు దేవుడు ఎటువంటి బదులు ఇవ్వలేదు. చెట్టు కొమ్మల మధ్యలో ఎలాగో వీలు చేసుకుని కొడుకు కోసం కొన్న పరికరాలలోంచి రంపం, గొడ్డలి బయటకు తీశాడు రైతు చైతూ.



“ఇలా జరిగిందంటే ఎవరూ నమ్మరు," అన్నాడు యలమంద, “రుజువుగా ఒక ఫొటో తీసుకుంటాను." చైతూ తన భార్య కోసం కొన్న కెమేరాని యలమంద వెదికి బయటకి తీశాడు, నెత్తి మీద నల్ల గుడ్డ వేసుకున్నాడు. కోపంగా చెట్టుని నరుకుతున్న రైతు చైతూ ఫొటో తీశాడు. తరవాత ఇద్దరూ కలిసి ఊష్-వీష్, ఊష్-వీష్ అంటూ రంపంతో చెట్టు కొమ్మలను కోశారు. కొంచెం సేపటికి చెట్టు కొమ్మలు అడ్డు తొలగి బండి బయటకు వచ్చింది. వాన కూడా ఆగిపోయింది. సూర్యుడు మళ్లీ బయటకు వచ్చాడు, గాలి వేడి ఎక్కసాగింది.

చెట్టు బరువుకి బండి బురదలోకి కొంచెం దిగింది. యలమంద తన ముసలి కాళ్లని నిగడదన్ని, బలమంతా ఉపయోగించి బండిని లాగాల్సి వచ్చింది. ఇక తొందరగానే ఇంటికి చేరుకుంటామని రైతు చైతూ అనుకున్నాడు. ఇప్పటికే చాలా ఆలస్యమయ్యింది. ఇంటి వద్ద అందరూ ఆందోళన పడుతుంటారని అతడికి తెలుసు.



కొంచెం సేపటికి బండి బాగా వాలుగా ఉన్న ప్రదేశం దగ్గరకి వచ్చింది. అంతలో శీల జారిపోవటంతో ముందువైపున ఒక చక్రం బండి నుంచి వేరుపడి వేగంగా కిందకి దొర్లుకుంటూ వెళ్లసాగింది. రైతు చైతూ బండి నుంచి కిందకి దిగి దాని వెంట పరిగెత్తసాగాడు. “ఆగు బాబు, ఆగు!" అతడు అరిచాడు. “దయచేసి ఆగు. నువ్వు లేకపోతే నేను ఇంటికి వెళ్లలేను. నా భార్య, పిల్లలు నా కోసం ఎదురు చూస్తుంటారు!'' చైతూ కష్టాలు చక్రానికి ఏమీ పట్టలేదు. అది ఎగురుతూ, గెంతుతూ దొర్లుకుంటూ వేగంగా వెళ్లి పోతూనే ఉంది. దిక్కు తోచని రైతు చైతూ దాని వెంటే ఏడుస్తూ పరిగెత్తుతున్నాడు.

చిన్న కొడుకు కోసం కొన్న హార్మోనికా రైతు చైతూ జేబులో తగిలింది. దానిని బయటకు తీసి పరిగెడుతూనే దానిని వాయించసాగాడు:

రిమ్-జిమ్, జిమ్-రిమ్,
రిజిజిజు
జబరమ్, తరజమ్ రిజిజిజు





చక్రానికి ఆ పాట నచ్చింది. అది కొంచెం తడబడి, తత్తరపడి పాట వినటానికి కింద పడిపోయింది. రైతు చైతూ వెంటనే దానిని పట్టేసుకున్నాడు. దానిని బాగా కుదిపి, తిట్టేశాడు. తరవాత దానిని ఈడ్చుకుంటూ పైకి తీసుకుని వెళ్లాడు. శీలతో దానిని ఇరుసుకి గట్టిగా బిగించేశాడు. చక్రాలు కూడా సొంతంగా ఆలోచించటం మొదలుపెట్టాయి అని రైతూ చైతూ గొణుక్కుంటున్నాడు! ఆపాటికి సాయంత్రం నాలుగు అయ్యింది.

“యలమంద, కొంచెం వేగంగా నడుస్తావా?"



“నేను బాగా అలిసిపోయాను."
“నాకు తెలుసు," అన్నాడు రైతు చైతూ.
“ఒకటి, రెండు కొరడా దెబ్బలు వెయ్యి," యలమంద సలహా ఇచ్చాడు. “మరీ మెల్లగా కాదు, మరీ గట్టిగా కాదు."

కొరడాని రైతు చైతూ గాలిలో గిరగిరా తిప్పి యలమందని మెల్లగా కొట్టాడు. “గాలి లాగా పరిగెత్తు!" అతడు అరిచాడు.
ఇప్పుడు పొడిగా ఉన్న నేలమీద యలమంద దౌడు తియ్యసాగాడు.



కొంచెం దూరం వెళ్లిన తరువాత యలమందకి తన మందపాటి కళ్లద్దాల లోంచి రోడ్డు దాటుతున్న తాబేలు కనపడింది. దానిని తప్పించబోయేసరికి అతడి కాలు ఒక గుంతలో పడింది. తరవాత కుంటుతూ నడిచాడు. నొప్పి ఎక్కువ కావటంతో కింద కూర్చునిపోయి పెద్దగా ఓండ్రపెట్టాడు. అతడి అరుపులకు జంతువులన్నీ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాయి.



“ఏమయ్యింది?" కిందకి దిగి అడిగాడు రైతు చైతూ.
“కాలు మెలిపడినట్లు ఉంది," యలమంద చెప్పాడు. “వెనక ఎడమ కాలు."
నొప్పితో అతడు మరోసారి పెద్దగా ఓండ్రపెట్టాడు.




“ఓండ్ర పెట్టడం వల్ల ఏమైనా లాభం ఉందా?" రైతు చైతూ కోపంగా అడిగాడు.
“నిజంగానే కాలు మెలిపడిందా? నిలబడటానికి ప్రయత్నం చెయ్యి." యలమంద
నిలబడటానికి ప్రయత్నించాడు, “నొప్పి వల్ల నిలబడలేకపోతున్నాను."

యలమంద ఈసారి బాధగా అన్నాడు, “నీ కోసం ఎదురు చూస్తున్న భార్య, పిల్లల దగ్గరకి ఇప్పుడు ఎలా వెళతావు? నా వల్ల ఎంత పని అయ్యింది! తలుచుకుంటేనే సిగ్గుగా ఉంది."

“బాధపడకు!" రైతు చైతూ అన్నాడు. యలమందని బండి నుంచి తప్పించాడు. కష్టపడి అతడిని ఎలాగో బండిలోకి ఎక్కించాడు.






బండి పగ్గాలను తన లావుపాటి పొట్టకు కట్టుకుంటున్న రైతు చైతూని
బండిలో ఉన్న యలమంద వింతగా చూస్తున్నాడు.
రైతు చైతూ బరువును లాగటానికి సిద్ధపడటం చూసి యలమంద
ఆశ్చర్యంతో అరిచాడు, “మాసబిల్లి ఊకంబా!"

తన బలమంతా ఉపయోగించి రైతు చైతూ బండిని లాగాడు. బండి ముందుకి కదిలింది. మెల్లగా వాళ్లు ఇంటికి దగ్గర అవుతున్నారు. యలమందకి ఇదంతా వింతగా ఉంది. అతడ తన కళ్లను తానే నమ్మలేకపోతున్నాడు. అయితే బండిలో కూర్చుని వెళ్లటం అతడికి సంతోషంగానే ఉంది. ఎల్లప్పుడూ ఇలాగే మార్చి మార్చి బండి లాగితే బాగుంటుందని అతడు అనుకోసాగాడు.

యలమంద కూర్చోవటం వల్ల బండి చాలా బరువుగా ఉంది. కాసేపటికి రైతు చైతూ వేగం తగ్గిపోయింది. బండి చక్రాలు కిర్రు కిర్రుమంటూ ముందుకు కదులుతున్నాయి.






ఇంటి దగ్గరి గుట్టకి వచ్చేసరికి సాయంత్రం ఆరయ్యింది. ముందుకి వంగి, తన శక్తినంతటిని ఉపయోగించి ఉస్సు అస్సు అనుకుంటూ రైతు చైతూ బండిని గుట్ట మీదకి లాగుతున్నాడు. బండిలో కూర్చున్న యలమందకి జాలి కలిగింది. "శబాష్ చైతూ! మొనగాడివంటే నువ్వే," అంటూ అతడిని ప్రోత్సహించాడు. ఆ మాటలతో రైతు చైతూకి ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది. ఆ ఊపుతో బండిని గుట్ట మీదకి లాగేశాడు.

గుట్ట మీద ఒక్క నిమిషం ఆగి ఊపిరి తీసుకున్నాడు రైతు చైతూ. గుట్ట కిందకి దిగుతున్న దారిని అతడు చూశాడు. ఇక నేను కష్టపడవలసిన అవసరం లేదు, దానంతట అదే బండి కిందకి వెళుతుందని అనుకున్నాడు.



ఒక్క కుదుపుతో బండి ముందుకి కదిలింది, వెంటనే అది వేగం పుంజుకుంది. బండి వేగానికి రైతు చైతూ తల్లకిందులవుతూ ఉన్నాడు. అతడి శరీరం పైకి లేచింది. కాళ్లు గాలిలో గింగిరాలు కొడుతున్నాయి. తన జీవితంలో ఇదే చివరి రోజు అని అతడికి అనిపించసాగింది, చూస్తుండగానే తన ప్రాణాలు పోయేటట్టు ఉన్నాయి. దేవుడిని ప్రార్థిస్తున్న యలమంద బ్రేకులు వెయ్యటంలో కొంచెం ఆలస్యం చేశాడు.

వేగంగా తిరిగుతున్న చక్రాలు రబడ్-డిబడ్, రబడ్-డిబడ్ అంటూ వింత శబ్దాలు చేస్తూ బండి నుంచి వేరుపడి తలా ఒక వైపు వెళ్లాయి. యలమంద ఎగిరిపడి బండి వెనకాల పడ్డాడు. రైతు చైతూ బండి కింద మట్టిలో పడ్డాడు.





యలమంద, రైతూ చైతూ, ఒకప్పటి బండి, దానిలోని సామాను అంతా చెల్లా చెదురుగా పడిపోయాయి.
“నీకు ఏం కాలేదు కదా?" రైతు చైతూ అడిగాడు. “ఏం జరిగిందో తెలుసుకోటానికి చాలా సమయం పట్టేటట్టు ఉంది," యలమంద బదులిచ్చాడు. “నీ పరిస్థితి ఏమిటి?" “వళ్లంతా నొప్పులుగా ఉంది," రైతు చైతూ చెప్పాడు, “అయితే బండి తప్పించి ఏమీ విరిగినట్టు లేదు." ఒకరినొకరు చూసుకుని తలలు ఊపారు. “బండిని బాగు చెయ్యలేం," రైతు చైతూ అన్నాడు. “ఎంతటి పనివాడికైనా దానిని బాగు చెయ్యటం చాలా కష్టం," అన్నాడు యలమంద.

“ఇప్పుడు ఏం చేద్దాం?" రైతు చైతూ అన్నాడు.
“నువ్వే నన్ను మోసుకుని వెళ్లాలి," యలమంద బదులిచ్చాడు.

“ఒక్క నిమిషం ఆగు!” అన్నాడు రైతు చైతూ. పూలమడిలో పడి ఉన్న సైకిలు అతడికి కనిపించింది.



“నాకు ఒక ఉపాయం తట్టింది!" రైతు చైతూ అన్నాడు. “తొందరగానే ఇంటికి చేరుకుంటాం!" సైకిలును కొంచెం దూరం తొక్కి చూశాడు. “ఇది మనల్ని ఇంటికి తీసుకెళుతుంది!" అతను పిలిచాడు. “తొందరగా పద!"

పరికరాల పెట్టెని సైకిలు క్యారేజీకి కట్టాడు. కెమేరా, దాని స్టాండుని యలమంద వీపుకి కట్టాడు. తరవాత రైతు చైతూ సైకిలు ఎక్కి కూర్చున్నాడు. యలమందని కూడా కూర్చోమన్నాడు. యలమంద సైకిలు ఎక్కి చైతూ మెడ మీద నుంచి చేతులను సైకిలు హ్యాండిల్ పైన వేశాడు.



వాళ్లిద్దరూ బాగా అలసిపోయి ఉన్నారు. సైకిల్ తొక్కుతుంటే రైతు చైతూ కాళ్లు వణుకుతున్నాయి. రోడ్డుమీద సైకిలు ఒంకరటింకరగా పోతోంది. చైతూ భుజాల మీద యలమంద నిద్రపోయి గురక కూడా పెట్టసాగాడు. "పచ్చని గడ్డి మీద నా దోస్తు యలమంద లాగా నిద్దర పోగలిగితే ఎంత బాగుంటుంది," అనుకున్నాడు రైతు చైతూ. అంతలోనే అతడికి అతని భార్యా, పిల్లలు, వాళ్ల ముద్దుమొహాలు గుర్తుకువచ్చాయి.



భార్యా, పిల్లల ప్రేమ అతడికి సైకిలు తొక్కే శక్తిని ఇచ్చాయి. సూర్యుడు ఒకవైపున కుంగుతూ ఉంటే అలసట కారణంగా ఇంకోవైపు చైతూ సైకిలు బాగా వంకరలు తిరుగుతోంది.
సూర్యుడు అస్తమించాడు. వాకిట్లో నాన్న కోసం ఎదురు చూస్తున్న పిల్లలకు దూరంగా ఒక లావుపాటి ఆకారం కనపడింది. ఆ వస్తున్నది ఎవరో వాళ్లకి వెంటనే తెలిసిపోయింది.  మనసులో ఎన్నో ప్రశ్నలు ఉన్నా సంతోషంతో వాళ్లు నాన్నకి ఎదురు పరిగెత్తారు.

వంటింటిలోంచి అంతా చూసిన రైతు భార్య వేగంగా బయటకు వచ్చి అందరినీ హత్తుకుంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంది. రైతు చైతూ ఒకవైపు నవ్వుతున్నాడు, ఒకవైపు ఏడుస్తున్నాడు. ముసలి యలమంద కూడా తన సంతోషాన్ని తెలియచెయ్యటానికి పెద్దగా ఓండ్ర పెట్టాడు. పట్టణం వెళ్లినవాళ్లు క్షేమంగా తిరిగివచ్చారని అందరికీ సంతోషంగా ఉంది.

కొంచెం సేపటికి అందరూ కబుర్లు చెప్పుకుంటూ అన్నం తినటానికి కూర్చున్నారు. అయితే, యలమంద మెలిపడిన కాలికి పట్టీవేసి ఉంది కాబట్టి అతడు కింద కూర్చోలేకపోయాడు. అతడు మంచం మీదే కూర్చుని అన్నం తిన్నాడు!



